# అథ సప్తవింశో%ధ్యాయః

## శంఖచూడుని జననము

సనత్కుమార ఉవాచ |

అథాన్యచ్ఛంభుచరితం ప్రేమతశ్శృణు వై మునే | యస్య శ్రవణమాత్రేణ శివభక్తిర్దృఢా భ##వేత్ || 1

శంఖచూడాభిధో వీరో దానవో దేవకంటకః | యథా శివేన నిహతో రణమూర్ధ్ని త్రిశూలతః || 2

తచ్ఛంభు చరితం దివ్యం పవిత్రం పాపనాశనమ్ | శృణు వ్యాస సుసంప్రీత్యా వచ్మి సుస్నేహతస్తవ || 3

మరీచేస్తనయో ధాతుః పుత్రో యః కశ్యపో మునిః | స ధర్మిష్ఠ స్సృష్టికర్తా విద్యాజ్ఞప్తః ప్రజాపతిః || 4

దక్షః ప్రీత్యా దదౌ తస్మై#ే నిజకన్యాస్త్రయోదశ | తాసాం ప్రసూతిః ప్రసభం న కథ్యా బహువిస్తృతాః || 5

యత్ర దేవాదినిఖిలం చరాచరమభూజ్జగత్ | విస్తరాత్తత్ర్పవక్తుం చ కః క్షమో%స్తి త్రిలోకకే || 6

ప్రస్తుతం శృణు వృత్తాంతం శంభులీలాన్వితం చ యత్ | తదేవ కథయామ్యద్య శృణు భక్తి ప్రవర్ధనమ్ || 7

సనత్కుమారుడిట్లు పలికెను -

ఓ మునీ! మరియొక శంభుగాథను ప్రేమతో వినుము. దీనిని విన్నంతమాత్రాన శివుని యందలి భక్తి దృఢమగును (1). వీరుడు, దేవతలను పీడించువాడు అగు శంఖచూడుడనే రాక్షసుని సంగ్రామములో శివుడు త్రిశూలముతో సంహరించిన గాథను వినుము (2). ఓ వ్యాసా! దివ్యము, పవిత్రము, పాపనాశనము అగు ఆ శంభుగాథను నీయందు గల స్నేహభావము వలన మిక్కిలి ప్రీతితో చెప్పు చున్నాను. వినుము (3). మరీచి ప్రజాపతి యొక్క

కుమారుడగు కశ్యపమహర్షి ధర్మాత్ముడు. ఆయన బ్రహ్మచే ఆజ్ఞాపించబడిన వాడై సృష్టిని గావించిన ప్రజాపతి (4). దక్షుడు ఆయనకు తన పదముగ్గురు కుమార్తెలనిచ్చి ప్రీతితో వివాహమును చేసెను. మిక్కిలి విస్తరించిన వారి సంతానమును గూర్చి విపులముగావర్ణించుట సంభవము కాదు (5). దేవతలు మొదలగు సమస్త స్థావర జంగమాత్మకమగు జగత్తు వారిసంతానమే. దానిని విస్తరముగా చెప్పగల సమర్థుడు ముల్లోకములలో ఎవరుగలరు? (6) శంభుని లీలలతో గూడినది, భక్తిని వర్ధిల్ల జేయునది అగు ప్రస్తుత గాతను మాత్రమే ఇప్పుడు చెప్పెదను వినుము (7).

తాసు కశ్యపపత్నీషు దనుస్త్వేకా వరాంగనా | మహారూపవతీ సాధ్వీ పతి సౌభాగ్యవర్ధినీ || 8

ఆసంస్తస్యా దనోః పుత్రా బహవో బలవత్తరాః | తేషాం నామాని నోచ్యంతే విస్తారభయతో మునే || 9

తేష్వేకో విప్రచిత్తిస్తు మహాబలపరాక్రమః | తత్పుత్రో ధార్మికో దంభో విష్ణుభక్తో జితేంద్రియః || 10

నాసీత్తత్తనయో వీరస్తత శ్చింతా పరో%భవత్| శుక్రాచార్యం గురుం కృత్వా కృష్ణమంత్రమవాప్య చ || 11

తపశ్చకార పరమం పుష్కరే లక్షవర్షకమ్ | కృష్ణమంత్రం జజాపైవ దృఢం బద్ధ్వాసనం చిరమ్ || 12

తపః ప్రకుర్వతస్తస్య మూర్ధ్నో నిస్సృత్య ప్రజ్వలత్ | విస సార చ సర్వత్ర తత్తేజో హి సుదుస్సహమ్ || 13

తేన తప్తాస్సురాస్సర్వే మునయో మనవస్తథా | సువాసీరం పురస్కృత్యం బ్రహ్మాణం శరణం యయుః || 14

ప్రణమ్య చ విధాతారం దాతారం సర్వసంపదామ్ | తుష్టువుర్వికలాః ప్రోచుస్స్వవృత్తాంతం విశేషతః || 15

తదాకర్ణ్య విధాతాపి వైకుంఠం తైర్య్ ̧° సహ | తదేవ విజ్ఞాపయితుం నిఖిలేన హి విష్ణవే || 16

తత్ర గత్వా త్రిలోకేశం విష్ణుం రక్షాకరం పరమ్ | ప్రణమ్య తుష్టువుస్సర్వే కరౌ బద్ధ్వా వినమ్రకాః || 17

ఆ కశ్యపుని భార్యలలో దనువు అను ఒక సుందరి గలదు. ఆమె గొప్ప రూపవతి, పతివ్రత, మరియు భర్తయొక్క సౌభాగ్యమును వృద్ధి చేయునది (8). ఆ దనువునకు మహాబలశాలురగు అనేక పుత్రులు గలరు. ఓ మునీ! విస్తారభయముచే వారి పేర్లను నేను చెప్పుట లేదు (9). వారిలో ఒకడు మహాబలపరాక్రమశాలి యగు విష్ణుచిత్తుడు. ఆతని పుత్రుడగు దంభుడు ధర్మాత్ముడు, విష్ణుభక్తుడు మరియు ఇంద్రియ జయము గలవాడు (10). ఆతనికి పుత్రసంతానము లేకుండెను. ఆ కారణము వలన ఆ వీరుడు దుఃఖితుడై శుక్రాచార్యుని గురువుగా చేసుకొని కృష్ణమంత్రమును స్వీకరించి (11), పుష్కరతీర్థమునందు లక్ష సంవత్సరములు గొప్ప తపస్సును చేసెను. ఆతడు ఆసనమును దృఢముగా బంధించి చిరకాలము కృష్ణ మంత్రమును మాత్రమే జపించెను (12). తపస్సును చేయుచున్న ఆతని శిరస్సునుండి సహింప శక్యము కానిది, జ్వాలలతో కూడి యున్నది అగు తేజస్సు ఉద్భవించి సర్వత్రా వ్యాపించెను (13). దానిచే పీడితులైన సర్వదేవతలు, మునులు మరియు మనువులు ఇంద్రుని ముందిడుకొని బ్రహ్మను శరణు వేడిరి (14). దుఃఖితులై యున్న వారు సమస్తసంపదలను ఇచ్చే బ్రహ్మను నమస్కరించి స్తుతించి తమ వృత్తాంతమును విశేషముగా వివరించి చెప్పిరి (15). ఆ వృత్తాంతమును విని బ్రహ్మ వారితో గూడి, అదే వృత్తాంతమును సమగ్రముగా విష్ణువునకు విన్నవించుటకొరకై వైకుంఠమును వెళ్లెను (16). వారందరు అచటకు వెళ్లి ముల్లోకములకు అధిపతి, రక్షకుడు, పరమాత్మయగు విష్ణువునకు ప్రణమల్లి వినయముతో చేతులు కట్టుకొని స్తుతించిరి (17).

దేవా ఊచుః |

దేవదేవ న జానీమో జాతం కిం కారణం త్విహ | సంతప్తాస్సకలా జాతాస్తేజసా కేన తద్వద || 18

తప్తాత్మనాం త్మమవితా దీనబంధోऽను జీవినామ్ | రక్ష రక్ష రమానాథ శరణ్యశ్శరణాగతాన్ || 19

దేవతలిట్లు పలికిరి -

ఓ దేవదేవా! కారణమేమి పుట్టినదో తెలియకున్నది. మేమందరము ఈ బ్రహ్మండములో తాపమును పొందుచున్నాము. దీనికి కారణమగు తేజస్సు ఏది? చెప్పుము (18). ఓ దీనబంధూ! తాపపీడితమైన మనస్సుగల నీ అనుచరులను నీవు రక్షించెదవు. ఓ రమానాథా! శరణ్యుడవగు నీవు శరణు పొందిన మమ్ములను రక్షింపుము, రక్షింపుము (19).

సనత్కుమార ఉవాచ |

ఇతి శ్రుత్వా వచో విష్ణుర్బ్రహ్మదీనాం దివౌకసామ్ | ఉవాచ విహసన్ ప్రేమ్ణా శరణాగతవత్సలః || 20

సనత్కుమారుడిట్లు పలికెను-

బ్రహ్మది దేవతల ఈ మాటలను విని శరణాగతవత్సలుడగు విష్ణువు ప్రేమతో నవ్వి ఇట్లు పలికెను (20).

విష్ణురువాచ |

సుస్వస్థా భవతావ్యగ్రా న భయం కురుతామరాః | నోపప్లవా భవిష్యంతే లయకాలో న విద్యతే || 21

దానవో దంభనామా హి మద్భక్తః కురుతే తపః | పుత్రార్థీ శమయిష్యామి తమహం వరదానతః || 22

విష్ణువు ఇట్లు పలికెను-

ఓ దేవతలారా! ఆందోళనను విడనాడి పూర్ణస్వస్థతను పొందుడు. భయపడకుడు. జలప్రళయము రాబోవుట లేదు. ఇది ప్రళయసమయము కాదు (21). నా భక్తుడగు దంభుడనే దానవుడు

పుత్రుని గోరి తపస్సును చేయుచున్నాడు. ఆతనికి వరమునిచ్చి ఆ తేజస్సును నేను చల్లార్చ గలను (22).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్తాస్తే సురాస్సర్వే ధైర్యమాలంబ్య వై మునే |
యయుర్బ్రహ్మాదయస్సుస్థాస్స్వస్వ ధామాని సర్వశః || 23

అచ్యుతో%పి వరం దాతుం పుష్కరం సంజగామ హ | తపశ్చరతి
యత్రాసౌ దంభనామ హి దానవః || 24

సనత్కుమారుడిట్లు పలికెను -

ఓ మునీ! విష్ణువు ఇట్లు పలుకగా బ్రహ్మాది దేవతలందరు ధైర్యమును స్వస్థతను పొంది అన్ని వైపులలో గల తమ తమ స్థానములకు వెళ్లిరి (23). అచ్యుతుడు కూడా దంభుడనే దానవుడు తపస్సు చేయుచున్న పుష్కరమునకు వరమునిచ్చుట కొరకై వెళ్లెను (24).

తత్ర గత్వా వరం బ్రూహీత్యువాచ పరిసాంత్వయన్ | గిరా
సూనృతయా భక్తం జపంతం స్వమను హరిః || 25

తచ్ఛ్రుత్వా వచనం విష్ణోర్దృష్ట్వా తం చ పురస్స్థితమ్ | ప్రణనామ
మహాభక్త్యా తుష్టావ చ పునః పునః || 26

విష్ణువు అచటకు వెళ్లి తన మంత్రమును జపించుచున్న ఆ భక్తుని మధురమగు వచనములతో ఉత్సాహపరిచి 'వరమును కోరుకొనుము' అని పలికెను (25). ఆతడు తన యెదుట నిలబడియున్న విష్ణువును గాంచి ఆయన పలుకులను విని మహాభక్తితో ప్రణమిల్లి పలుమార్లు స్తుతించెను (26).

దంభ ఉవాచ |

దేవదేవ నమస్తే%స్తు పుండరీకవిలోచన | రమానాథ త్రిలోకేశ
కృపాం కురు మమోపరి || 27

స్వభక్తం తనయం దేహి మహాబల పరాక్రమమ్ | త్రిలోకజయినం వీరమజేయం చ దివౌకసామ్ || 28

దంభుడిట్లు పలికెను -

ఓ దేవదేవా! నీకు నమస్కారము. పద్మముల వంటి కన్నులు గలవాడా! లక్ష్మీపతి! త్రిలోకనాథా ! నాపై దయను చూపుము (27). నీ భక్తుడు, గొప్ప బలము పరాక్రమము గలవాడు, ముల్లోకములను జయించు వాడు, వీరుడు, దేవతల కైననూ జయింపశక్యము కానివాడు అగు పుత్రుని ఇమ్ము (28)

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్తో దానవేంద్రేణ తం వరం ప్రదదౌ హరిః | నివర్త్య చోగ్రతపసస్తతోఽంతరధాన్మునే || 29

గతే హరౌ దానవేంద్రః కృత్వా తస్మై#్య దిశే నమః | జగామ స్వగృహం సిద్ధ తపాః పూర్ణమనోరథః || 30

కాలేనాల్పేన తత్పత్నీ సగర్భా భాగ్య వత్యభూత్ | రరాజ తేజసాత్యంతం రోచయంతీ గృహాంతరమ్ || 31

సుదామా నామ గోపో యో కృష్ణస్య పార్షదాగ్రణీః | తస్యా గర్భే వివేషాసౌ రాధాశప్తశ్చ యన్మునే || 32

అసూత సమయే సాధ్వీ సుప్రభం తనయం తతః | జాతకం సు చకారాసౌ పితాహూయ మునీన్ బహూన్ || 33

సనత్కుమారుడిట్లు పలికెను -

ఓ మునీ! ఆ రాక్షసేంద్రుడు ఇట్లు కోరగా విష్ణువు అతనికి ఆ వరమునిచ్చి కఠినమగు తపస్సును విరమింప జేసి తరువాత అంతర్ధానము జెందెను (29). విష్ణువు అంతర్ధానమైన తరువాత ఆ రాక్షసేంద్రుడు ఆ దిక్కునకు నమస్కారము చేసెను. ఆతని తపస్సు సిద్ధించెను. ఆతని కోరిక ఈడేరెను. అపుడాతడు తన గృహమునకు వెళ్లెను (30). కొద్ది కాలములో భాగ్యవంతురాలగు

ఆతని భార్య గర్భవతియై తన తేజస్సుతో ఇంటిలోపల భాగములన మిక్కిలి ప్రకాశింపజేయుచూ శోభిల్లెను (31). ఓ మునీ! శ్రీకృష్ణుని అనూయాయులలో మొదటి వాడు, రాధచే శపింపబడినవాడు అగు సుదాముడనే గోపాలకుడు ఆమె గర్భములో ప్రవేశించి యుండెను (32). తరువాత ఆ పతివ్రత నెలలు నిండిన పిదప గొప్ప తేజస్సు గల పుత్రుని గనెను. తండ్రి అనేక మహర్షులను పిలిపించి ఆ బాలుని జాతకర్మను చేయించెను (33).

ఉత్సవస్సుమహానాసీత్తస్మిన్ జాతే ద్విజోత్తమ | నామ చక్రే పితా తస్య శంఖచూడేతి సద్దినే || 34

పితుర్గేహే స వవృధే శుక్లపక్షే యథా శశీ | శైశ##వే%భ్యస్త విద్యస్తు స బభూవ సుదీప్తి మాన్ || 35

స బాలక్రీడయా నిత్యం పిత్రోర్హర్షం తతాన హ | ప్రియో బభూవ సర్వేషాం కులజానాం విశేషతః || 36

ఇతి శ్రీ శివమహాపురాణ రుద్రసంహితాయాం యుద్ధఖండే శంఖచూడోత్పత్తి వర్ణనం నామ సప్త వింశో%ధ్యాయః (27).

ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! ఆ బాలుడు జన్మించగానే గొప్ప ఉత్సవము జరిగెను. వానికి తండ్రి శుభముహూర్తమునందు శంఖచూడుడు అని నామకరణము చేసెను (34). ఆ బాలుడు తండ్రి గృహములో శుక్లపక్షచంద్రుని వలె పెరిగెను. గొప్ప తేజస్సు గల ఆ బాలుడు బాల్యమునందే విద్యలనభ్యసించెను (35). ఆ బాలుడు ఆటపాటలతో నిత్యము తల్లి దండ్రుల ఆనందమును విస్తరింప జేసెను. బంధువర్గములోని వారందరికీ ఆ బాలుడు విశేషించి ప్రీతి పాత్రుడాయెను (36).

శ్రీ శివమహాపురాణములోని రుద్రసంహితయందు యుద్ధఖండలో శంఖచూడోత్పత్తి వర్ణనమనే ఇరువది ఏడవ అధ్యాయము ముగిసినది (27).